# రైక్వుడు

ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య




తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

వేదకథాభారతి - 13

# రైక్వుడు

రచన - ప్రధాన సంపాదకత్వం

ప్రొఫెసర్ ఎస్.బి.రఘునాథాచార్య




ప్రచురణ

డాక్టర్ ఐ.వి.సుబ్బారావు, ఐ.ఏ.ఎస్.,

కార్యనిర్వహణాధికారి

తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి

1999

# మామాట

**డాక్టర్ ఐ.వి. సుబ్బారావు,** ఐ.ఏ.ఎస్.,
కార్యనిర్వహణాధికారి
తిరుమల తిరుపతి దేవస్థానములు
తిరుపతి

నిత్య సత్యమైన ప్రమాణాలు వేదాలు. మానవజాతి మనుగడకు అడుగడుగునా మార్గదర్శనం చేస్తూ నిస్స్వార్థ బుద్ధితో, త్యాగమయమైన ప్రవృత్తితో తమ తమ జీవితాలను పండించుకున్న ఎందరో మహానుభావుల జీవన వైభవాలు మనకు వేద వాఙ్మయంలో దర్శనమిస్తున్నాయి.

''ఆహా! ఎటువంటి కర్తవ్యదీక్ష! ఎంత విశాలదృష్టి! ఎటువంటి విశ్వకల్యాణభావన! ఎంతటి ధార్మికచేతన!'' అని మనల్ని ఆశ్చర్యపరిచే జీవనవేదం మనకీ వాఙ్మయంలో ప్రత్యక్షమౌతుంది. ఆ వేదనాదాన్ని ఇంటింటా వినిపించాలనే మా ఆకాంక్షకు ప్రతిరూపమే -

**ఈ వేద కథా భారతి.**

వేదకథాభారతిలోని ఎనలేని మానవత్వపు విలువలు ఈ తరాన్ని ప్రభావితం చేయగలిగితే అంతకంటే మాకు ఆనందమేముంటుంది ?

ఈ కథాపుష్పాలను సంపాదించి తీర్చి దిద్ది అందమైన మాలగా రూపొందించిన ప్రొఫెసర్ ఎస్.బి. రఘునాథాచార్య గారిని మనసార అభినందిస్తున్నాను.

ఇంత చక్కగా ముద్రించిన అన్నపూర్ణ గ్రాఫిక్స్ వారికి అభినందనలు.

జయతు జయతు భారతీ
వేద కథా భారతీ



# మనవి

వేద కథాభారతి.

అంతశ్శత్రువులను అణచివేసి కొన్ని ఆదర్శాలకు, విలువలకు పట్టంకట్టి, ధార్మిక జీవనానికి ప్రాణంపోస్తూ ఈ లోకంలోనే కాక ఇతరలోకాల వారికి కూడా నిండైన మానవత్వమంటే 'ఇది' అని ఆచరణ పూర్వకంగా నిరూపిస్తూ, అందులోని మధురిమలను చవిచూపిస్తూ వేదనాదవిభాసురమైన ఒక జీవన స్రవంతి ఈ గడ్డపై వెల్లివిరిసింది.

జలజలసాగే ఆ అమృత వాహిని వసుంధరను రసమయం చేసింది. సస్యశ్యామలం చేసింది. సుగంధపరిమళాలను వెదజల్లే నందనోద్యాలను వెలయించింది. మానవ సృష్టిలో అరుదైన ప్రమాణాలను కొన్నింటిని నిలబెట్టింది. వాటికి కాలదోషం లేదు. ఆనాటికి, ఈ నాటికి, ఏనాటికైనా మానవతకు గమ్యాన్ని, జీవనానికి అర్థాన్ని పరమార్థాన్ని సాధించడంలో ఆ ప్రమాణాలు చరితార్థాలయినాయి. అలాంటి జీవన చిత్రాలకు పట్టిన అద్దమే ఈ వేదకథాభారతి.

ఒక్కసారి పరిశీలించండి ! ఆ చిత్రరామణీయకతను మంచిమనసుతో దర్శించండి ! వారి ఆత్మల ఔన్నత్యాన్ని వారి భావనల ఔచిత్యాన్ని మీరు తప్పక అభినందిస్తారు ! అవి మంచివని తోస్తే అనుసరించచడానికి ప్రయత్నించండి ! ఆనందించండి !

ప్రమాథి - నిజజ్యేష్ఠ

బహుళ - సప్తమి

5-7-1999

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య

# రైక్వుడు

**మార్గాయాసం తగ్గించుకోండి!**

''రండి! రండి! చాలా దూరంనుంచి ప్రయాణంచేసి వస్తున్నట్టున్నారు. ఎంతో శ్రమపడినట్లు కనపడుతున్నారు. ఈపూటకిక్కడ విశ్రాంతి తీసుకోండి. మీ నిత్యానుష్ఠానానికి ఇక్కడ ఏలోటూ లేదు. అదుగో ప్రక్కనే స్వచ్ఛమైన సెలయేరు పారుతోంది. స్నాన సంధ్యాదులు పూర్తి చేసుకోండి. మీరు వచ్చేలోపు అందఱికి భోజనానికి ఏర్పాట్లు పూర్తి చేస్తాం. భగవత్ప్రసాదాన్ని తీసుకొని కొంతసేపు విశ్రాంతి తీసుకోవచ్చు. మీ మార్గాయాసం కొంతైనా తగ్గించుకోవచ్చు. అతిధులకు అభ్యాగతులకు ఏలోటూరాకుండా శ్రద్ధగా చూసుకోమని మహారాజుగారి ఆజ్ఞ'' అని అప్పుడే విచ్చేసిన అతిథివర్యులను సాదరంగా ఆహ్వానిస్తున్నారు అక్కడ ఉన్న అధికారులు. అక్కడి సన్నివేశంచూస్తే అదొక చక్కని ధర్మసత్రం లాగా ఉంది. అధికారుల వినయమధురమైన మాటలు, చిఱునవ్వుతో ఆప్యాయంగా వారు అభ్యాగతుల నాహ్వానిస్తున్న తీరు ఎంతో అపురూపంగా కనపడుతున్నది.

**ఎంత పవిత్రమైన వాతావరణం!**

ఓహో! వీరు భోజనాలు పూర్తి చేసుకొని భుక్తాయాసంతో, సంతృప్తితో ''అన్నదాతా సుఖీభవ'' అంటూ ఎవరినో ఆశీర్వదిస్తున్నట్లున్నారు. ఇంకొందరు ఇప్పుడే వచ్చినట్లున్నారు. పక్కనే ఉన్న సెలయేట్లో స్నానం చేయడానికి వెడుతున్నట్లున్నారు. అక్కడేదో అఘమర్షణ సూక్తం వినపడుతూంది. చల్లటి తియ్యటి సెలయేటి జలాల్లో

స్నానం చేస్తున్న బ్రాహ్మణోత్తముల ఉచ్చారణ కాబోలు. కొందఱు సూర్య భగవానునికి ఎదురుగా నిలబడి దోసిళ్లతో నీళ్లు సెలయేట్లో వదులుతూ ఏవో మంత్రాలను ఉచ్చరిస్తున్నారు. మాధ్యాహ్నిక సంధ్యావందనం చేసే విప్రుల అర్ఘ్యప్రదానాల్లాగా ఉన్నాయి. కళ్లుమూసుకొని జంధ్యాలను వేళ్లతో పట్టుకొని ఏదో మంత్రజపం చేస్తున్నారు కొంతమంది. గాయత్రీజపమను కుంటాను. ఇంకొందఱు జపతపాలను పూర్తిచేసుకొని, ధౌతవస్త్రాలను ధరించి ఇటువైపే వస్తున్నారు. అధికారులెవరో ఎదురువెళ్లి వాళ్లను భోజనానికి ఆదరంతో ఆహ్వానిస్తున్నట్లున్నారు. చక్కని ఆశ్రమ వాతావరణం. ధర్మ సత్రప్రాంగణం లాగా ఉంది. చుట్టూ కూర్చున్న వేద విద్యార్థులకు ఉపాధ్యాయుడు సంహితా పాఠం సంత చెపుతున్నాడు. తుచ తప్పకుండా విద్యార్థులు ఒకే స్వరంతో ఉపాధ్యాయుడు ఉచ్చరించినట్లు వేదమంత్రాలను పునరుచ్చరిస్తున్నారు. మిగతావారు స్నానాదుల్ని పూర్తిచేసికొని భోజనాగారంలో ప్రవేశిస్తున్నారు.

**అతిథులను ఆదరించండి!**

మధ్యవయసులో ఉన్న ఒక అధికారి అప్పుడే అశ్వం దిగి వచ్చి బాటసారులను కుశల ప్రశ్నలడుగుతూ-

*''భోజనమర్యాదలు చక్కగా జరిగినాయా?*

*మీకు ఇక్కడ ఏ అసౌకర్యం లేదు గదా!''*

అని పలకరిస్తూ ఆ సత్రంలో పనిచేసే వాళ్లను ఇలా హెచ్చరిస్తున్నాడు-

*''శ్రీ శ్రీ శ్రీ మహారాజ జానశ్రుతి ప్రభువుల ఏలుబడిలో మహావృష సామ్రాజ్యంలో ఎక్కడైనా సరే అతిథులకు అభ్యాగతులకు ఆవాస-భోజనాది వ్యవస్థలో ఏ లోటు జరుగకూడదు. రాజుగారు ధర్మప్రభువులు. మన*

సామ్రాజ్యవ్యాప్తంగా ఉన్న ఏ ధర్మసత్రంలోనూ, అతిథిగృహంలోను ఎవరికీ ఎక్కడా ఏ కొంచెం లోపం రాకుండా అన్ని చర్యలూ తీసుకున్నాం. జాగ్రత్తగా శ్రద్ధగా, ప్రేమతో, సాక్షాత్తు విష్ణుస్వరూపులుగా అతిథులను ఆదరించండి''.

**మా తపఃఫలమే :**

ఓహో! ఇది మహావృషసామ్రాజ్యాధినేత జానశ్రుతి మహారాజుగారి ఏలుబడిలో ఉన్న ప్రాంతమన్నమాట. అన్ని విధాలా తాను ధర్మమార్గంలో నడుస్తూ, ప్రజలను అదే మార్గంలో నడిపిస్తూ ఆదర్శమైన పరిపాలన చేస్తున్న మహీపతి జానశ్రుతి. ఆయన ధర్మానికి కేంద్రబిందువు. సత్యానికి సన్నిధి. దయకు పుట్టినిల్లు. దానగుణానికి ఉత్పత్తిస్థానం. ఆయన మంత్రులు నీతిశాస్త్రాలను ఆపోశన పట్టిన ఉత్తమ పరిపాలకులు. ఆయన సైనికులు రాజ్య రక్షణ ధర్మానికి అంకితమైన అఖండ ధైర్యసాహస పరాక్రమోపేతులు. ఆయన సేవకులు పరిగృహీత నిరన్తరసేవాదీక్షా పరతంత్రులు. ఆయనకు తెలియని ధర్మ సూక్ష్మం లేదు. వేదవేదాంగ ధర్మశాస్త్రాదులలో నిష్ణాతులైన పండితశిరోమణులు ఆయన ఆస్థానానికి శోభను పెంచే విలక్షణాలంకార భూతులు. ఆయన ఏలుబడిలో ఉన్న మహావృషసామ్రాజ్యం ఎప్పుడో చేసుకున్న తపఃఫలమే ఆ మహారాజురూపంలో అవతరించిందని ప్రజలందఱు ఏకగ్రీవంగా అనుకొనేమాట.

**నన్నుమించినవాడున్నాడా?**

నిత్యం దాన ధర్మాలు చేస్తూ అతిథులను, అభ్యాగతులను తన సామ్రాజ్యంలో లెక్కలేనన్ని కేంద్రాలలో ఆదరిస్తూ కీర్తి ప్రతిష్ఠలను

సంపాదించిన మహారాజుకు కొంతకాలమయ్యేటప్పటికి కొద్ది కొద్దిగా అహంకారం అంకురించింది. గర్వం మొగ్గతొడిగింది. ఏ పని చేసినా దానికి లక్ష్యం కీర్తి అయింది. ధీరోదాత్తునికుండవలసిన అవికత్థనత్వం కాలంగడిచే కొద్దీ తగ్గిపోయింది. అవికత్థనత్వమంటే ఇతరులపొగడ్తలను అంగీకరించకపోవడం, సహించలేకపోవడం. రాను రాను ప్రశంసలకు పొంగిపోవడం అలవాటై పోయింది. తమ యజమాని పొగడ్తలకు లొబడతాడని తెలిస్తే ఇక చుట్టూచేరే వందివమాగధులకు లోటేముంటుంది? తమ పబ్బం గడుపుకోవడానికి రాజును నీవు ఇంద్రుడివి, నీవు చంద్రుడివని ముఖస్తుతి చేయడం మొదలెట్టారు. జానశ్రుతి కీర్తిలోలుపత్వం ఆయన సంస్కారాన్ని పాడు చేసింది. ఈ లోకంలో నన్ను మించిన ధార్మికుడు, దానధర్మాలు చేసేవాడు ఇంకెవరున్నారని భావించాడు. అపమార్గంలో అడుగు పెట్టాడు. మహారాజు గొప్పజ్ఞాని. కాని ఏంలాభం? అహంకారంతో ఆ జ్ఞానం మసిబారిపోయింది. సంస్కారం వెలవెలపోయింది. అజ్ఞానాంధకారంలో పడిపోయాడు మహారాజు. పథ్యాచరణం మానేసి మిథ్యాచరణం వైపు మొగ్గుచూపాడు.

దానధర్మాలలో తనతో పోలగల వారెవ్వరున్నారని అనుయాయులను ప్రశ్నించేవాడు. ధర్మకార్యాలు చేయడం ద్వారా వచ్చిన పుణ్యం మనశ్శాంతిని ఇస్తుందని భావిస్తుండే వాడు. తను చేసే దానాలతో ఎప్పుడూ తన ధార్మికప్రవృత్తిని కొలుచుకుంటూ ఉండే అతడికి తానెంతో గొప్పవాడిననే భావన లోలోపల స్థిరపడిపోయింది.

**లోలోపల మురిసిపోయాడు :**

జ్ఞానులలో ప్రాకృతసంస్కారాల వల్ల, బలవత్తరమైన కారణాలవల్ల ఎప్పుడైనా ప్రాపంచికమైన దృష్టి కలిగినప్పుడు భగవంతుడు వారిని

పతనావస్థనుండి తప్పించడానికి వారిజీవితాల్లో విచిత్రమైన సంఘటనలను కలుగజేస్తాడు. ఈ మహానుభావుడి విషయంలో కూడా అనుకోకుండా అలాంటి సంఘటనే జరిగింది. చూడండి -

అదొక శుభరాత్రి. మహారాజు దైనిక కార్యకలాపాలలో బాగా డస్సిపోయి విశ్రాంతికోసం తన హర్మ్యాగ్ర భాగాన అమర్చిన శయనతల్పంపైన పడుకొని ఆకాశంవంక పరిశీలనగా చూస్తున్నాడు. నిండైన పండువెన్నెల. తాకీ తాకగానే మైమరపించే మలయానిలం. కదిపితే చాలు 'చిత్తం' అంటూ ఎదుటనిలబడే దాసదాసీజనం. అప్సరస్త్రీలను మించిన అందాలనొలికించే ప్రియభామినీ సమూహం చేసే పరిచర్యలు. ఎలాంటివాడికైనా తన వైభవం చూసి గర్వపడాల్సిన సమయమది. జానశ్రుతి తన అదృష్టానికి లోలోపల మురిసిపోతున్నాడు.

**భస్మమై పోతావు జాగ్రత్త!**

ఇంతలో ఆకాశంలో రెండు హంసలు ఆ హర్మ్యం వైపే ఎగురుతూ రావడం కనపడింది. ఒక హంస రెండో హంసతో ఇలా అంటున్నది-

*"ఓ భల్లాక్షా!*
*ఎక్కడికి అటు ఎగిరి పోతున్నావు?*
*ఈ హర్మ్యం ఎవరిదో తెలుసా?*
*ధర్మ ప్రభువైన మహీపతి జానశ్రుతిది.*

*కళ్లు మూసుకొని మహారాజు కీర్తి ప్రకాశంలో చొరబడి ఎగరటానికి ప్రయత్నించావో భస్మమై పోతావు. జాగ్రత్త. జానశ్రుతితో*

సమానంగా దానధర్మాలు చేయగల భూపతి ఇంకొకడు లేడని తెలుసుకో! ఈయన ఎంతటి జ్ఞానో అంతకంటే మించిన ధర్మాచరణ తత్పరుడు. ఈయనకు ఈయనే సాటి. ఎందుకైనా మంచిది దోవ ప్రక్కకు మళ్లించు.''

అంత గొప్పవాడేంకాదు :

ఈ మాటలు విన్న రెండో హంస గుక్క తిప్పుకోకుండా పకపకా నవ్వి ఇలా అన్నది -

''నీ అమాయకత్వానికి జాలి పడుతున్నాను.

నీవా ఇలాంటి మాటలంటూ నన్ను భయపెడుతున్నది.

ఆకాశంలో సంచరిస్తూ మనం ఎన్నో రాజ్యాలను, వాటినేలే ప్రభువుల శక్తియుక్తుల్ని తెలుసుకుంటుంటాం. నీవు చాలా పొరపాటుపడుతున్నావు. బండితోలుకుంటూ జీవనాన్ని గడుపుతున్న ఆ రైక్వునికంటే ఈ జానశ్రుతి గొప్పవాడేంకాదు. ఆ మహాత్ముడు గొప్ప ఆత్మజ్ఞాని. ఏ ధర్మకార్యాలు చేయకుండానే జానశ్రుతిని మించిన ప్రభావాన్ని సంపాదించుకున్నాడు. అతడికి జరిగిపోయిన దాన్ని గురించిన చింతలేదు. ఏమి జరుగుతున్నదో పట్టించుకోడు. ముందు జరగ బోయే దాన్ని గురించి ఆలోచించడు. మహావిరక్తుడు, కీర్తికామనారహితుడు. ఇక జానశ్రుతి చేసే ప్రతిపనీ కీర్తి కాంక్షతో చేసేదే. అతనికి లోలోపల తనను మించిన ధార్మికుడు లేడనే అహంభావంకూడా ఉంది. అటువంటి ఈ జానశ్రుతి ఎక్కడ? ఆత్మజ్ఞానప్రకాశంతో వెలిగిపోయే ఆ రైక్వుడెక్కడ?''

ఎవరామహాత్ముడు?

ఆరెండు హంసలు ఇలా మాట్లాడుకొంటూ అనంతమైన విహాయసపు అంచుల్ని వెదుక్కుంటూ అలా అలా ఎగురుతూ వెళ్లి పోయినాయి. ఎన్నో భాషలలో నేర్పరి అయిన జానశ్రుతికి ఈ సంభాషణ చెవిలో పడేసరికి మతిపోయినట్లయింది. ఇన్నాళ్లు లోలోపల పెంచుకున్న అహంకారపు కారుచీకట్లు పటాపంచలయ్యాయి. ఆత్మవిమర్శ అనే జ్ఞానజ్యోతి ఆవిర్భవించింది. ఆకాశంలో ఎక్కడినుంచో వచ్చిన నల్లమబ్బులు చంద్రుణ్ణి కప్పివేశాయి. అప్పటి దాకా వెల్లివిరిసిన చిక్కని చక్కని వెన్నెల నెమ్మది నెమ్మదిగా కనుమరుగైంది. పగలంతా శ్రమించిన ప్రపంచమంతా గాఢనిద్రలో కూరుకుపోయింది.

జానశ్రుతి కనురెప్పవాల్చలేదు. నిశ్చేష్టుడైనాడు. అంతవఱకు అనుభవించిన ఆనందం ఏమయిపోయిందో తెలియదు. అతనిలో అంతర్మథనం ఆరంభమైంది. అంతకు ముందు ఏర్పడిన గర్వపర్వతాలు కుంగి పోయాయి. సహజంగా జ్ఞాని కావడం వల్ల వివేకంతో ఆలోచించడం మొదలెట్టాడు.

''ఎవరా మహాత్ముడు?

రైక్వుడా? . . . . విచిత్రం!

*విశాల మహావృషసామ్రాజ్యంలో నేనెప్పుడూ అలాంటి పేరు వినలేదే? అయినా నాపిచ్చిగాని ఎంతమంది మహనీయులు తమ ఉనికి తెలియకుండా ఈవసుంధరను అలంకరించి ఉన్నారో! నాలాంటి కీర్తికాముకులకు వారెందుకు కనపడతారు? ఆ మహాత్ముడి జాడ తప్పక తెలుసుకోవాలి. ఆ ఆత్మజ్ఞాని ముందు*

*సవినయంగా మోకరిల్లాలి. అదే నేను ఇన్నాళ్లు పెంచుకున్న అహంకారానికి సరైన ప్రాయశ్చిత్తం.''*

రాత్రంతా ఇలాంటి ఆలోచనల అలలు అతని మనఃకాసారాన్ని కలచి వేశాయి. అంతకుముందు వఱకు నిస్తరంగంగా ఉన్న ఆరాజు అంతరంగాన్ని ఊహించని భావాలు ఒక్కుమ్మడిగా ముట్టడించాయి.

**నాకీ పొగడ్త లెందుకు?**

మసక చీకట్లు తప్పుచేసిన వారిలా మెలమెల్లగా పక్కకు తప్పుకుంటున్నాయి. పక్షుల కిలకిలారావాలు జానశ్రుతిని వెక్కిరిస్తున్నట్లున్నాయి. ఎలాగో తెల్లవారింది. వందిమాగధులు స్తుతిపాఠాలతో, సుప్రభాత గీతికలతో మహారాజును నిద్రలేపడానికి విచ్చేశారు. జానశ్రుతి నిద్రపోతే గదా! లేవడానికి. ఎన్నడూలేనిది ఏమిటీ వింత! అని వారు ఆశ్చర్యపడ్డారు. అయినా వారి కర్తవ్యాన్ని వారు నిర్వహించడానికుపక్రమించారు. వారి ఆచారప్రకారం వైతాళికులు-

*''మేలుకో! మహారాజా! సూర్యోదయమవుతున్నది. నీ దానశౌండిమను విని ఎంతమందో అర్థులు నీవిచ్చే దానాలను పరిగ్రహించడానికి వచ్చి ఎదుఱు చూస్తున్నారు. దాన ధర్మాలు చేయడంలో నీకు నీవే సాటి. ముల్లోకాల్లోను నిన్ను మించిన ధర్మదాత ఇంకెవ్వరు లేరు''.*

అని స్తుతించడం మొదలు పెట్టారు. కాని ఇదివఱకటి లాగా జానశ్రుతి వైతాళికుల పొగడ్తలు విని సంతోషపడలేక పోయినాడు. నిజానికి సిగ్గు పడ్డాడు.

*''నా సామ్రాజ్యంలోనే నన్ను మించిన ఆత్మ జ్ఞాని ఉండగా*

*నాకీ పొగడ్తలేమిటి?''*

అని లోలోపల భావించాడు. పొగడ్తలాపించి పంపివేశాడు. వెంటనే అమాత్యులను పిలిపించా ఇలా ఆదేశించాడు -

*''మనసామ్రాజ్యంలో ఎంతో గొప్పవాడు, మహాత్ముడు, వైరాగ్యమూర్తి అయిన రైక్వుడనే మహానుభావుడున్నాడు. పట్టణాలు, పల్లెలు గాలించి ఆ మహనీయుడెక్కడున్నాడో నాకు వెంటనే తెలియజేయండి. నేను ఆయన దర్శనం చేయాలి. అంత వఱకు నాకు మనశ్శాంతి లేదు''.*

ఇప్పుడేం చేయాలి?

రాజాజ్ఞనను సరించి వెంటనే భటులు సామ్రాజ్యమంతటా రైక్వుడి కోసం గాలించారు. కాని ఎక్కడా ఆయన ఆచూకీ దొరకలేదు. ఎవరికీ ఆయనను గురించి తెలిసినట్లు లేదు. అందఱు ''అలాంటి పేరే వినలేదు''ని, ''ఆయన ఎలా ఉంటాడో, ఎక్కడుంటాడో కూడా మాకు తెలియదు''ని సమాధానం చెప్పారు. జానశ్రుతి ఎంతో నిరుత్సాహపడ్డాడు.

''అయ్యో! రైక్వుడిని ఎలా కలుసుకోవడం?
ఎక్కడా కనపడలేదంటున్నారే!
ఇప్పుడేం చేయాలి?

*అలా ఎక్కడా లేకపోతే హంసలెలా అతణ్ణే గురించి మాట్లాడుకున్నాయి? నేను వినడంలో ఏదైనా పొరపాటు జరిగిందా? అలా జరగడానికి వీల్లేదే''.*

అని అనేకరకాలుగా ఆలోచించాడు. చివఱకు మళ్లీ వెతికించడానికే నిశ్చయించుకున్నాడు. భటులకిలా చెప్పాడు-

*''ఆధ్యాత్మికజ్ఞాన సంపన్నులు, బ్రహ్మనిష్ఠులు, వైరాగ్యమూర్తులైన మహనీయులు సామాన్యులలాగా అందరికీ అందుబాటులో ఉండరు. వారెక్కడో ఏకాంతప్రదేశంలో తపస్సో, ధ్యానమో చేసుకుంటూ ఉంటారు. జాగ్రత్తగా మారుమూల ప్రాంతాల్లో కూడా వెతకండి''.*

రాజు చాలా పట్టుదలతో ఉన్నాడని, ఆమహనీయుని చూడందే గంగ కూడా ముట్టేటట్లు లేడని భటులు గ్రహించారు. రాజు పడుతున్న ఆవేదనను అర్థం చేసుకుని మహావృషసామ్రాజ్యంలో ప్రతిపల్లెను గాలించడం మొదలు పెట్టారు.

**నేనే రైక్వుణ్ణి!**

మొదట్లో వారికి రైక్వుని జాడ తెలిసింది కాదు. నిరుత్సాహపడకుండా తిరిగి తిరిగి వెదకగా మారుమూల ఒక పల్లెలో రైక్వుడనే వాడున్నట్లు సమాచారమందింది. ఆ కుగ్రామానికి ఎలాగో వెళ్ళి గ్రామస్థులనడిగారు రాజభటులు. గ్రామంలో వారు ఒక బండికింద కూర్చొని ఉన్న వ్యక్తిని చూపించి ఈయనే రైక్వుడని చెప్పారు. భటులకాశ్చర్యం కలిగింది. ఆయనను సమీపించి ఇలా అన్నారు-

*''మహాత్మా! మీరేనా రైక్వుడంటే?''*

*''అవును. నేనే రైక్వుణ్ణి''*

**ప్రయాణానికి సిద్ధంచేయండి!**

భటులు మొదట్లో నమ్మలేదు.

*''ఈ కుగ్రామంలో బండితోలుకుని జీవించే ఈయనా*

మహాత్ముడు! ఇతడినేనా దర్శించాలని మన మహారాజు నిద్రాహారాలు మానేశాడు. ఇతణ్ణివెదుక్కుంటూనా ఇంతమంది రాజభటులు దేశవిదేశాలు తిరుగుతున్నారు! అయినా ఏపుట్టలో ఏపాముందో ఎవరికి తెలుసు? నిజంగా ఈయనే ఆమహాత్ముడైతే మన జన్మ ధన్యమైందనే చెప్పాలి. వెంటనే మహారాజుకు ఈ వృత్తాంతాన్ని తెలియజేయడం మనధర్మం''

అనుకొని హుటాహుటిన రాజధానికి చేరి రాజు కిలా విన్నవించారు-

''ప్రభూ! ఎట్టకేలకు రైక్వుని వృత్తాంతం తెలుసుకున్నాం. ఆయనొక మారుమూల పల్లెలో బండితోలుకుంటూ జీవనం గడుపుతున్నాడు.''

ఆమాటలు విన్న జానశ్రుతి ఆనందానికి అవధుల్లేవు.

''ఆ! ఆమహానుభావుడున్నాడా? ఎక్కడున్నాడు? ఎలా ఉన్నాడు? మీతో మాట్లాడాడా?''

అంటూ ప్రశ్నపరంపరలను గుప్పించాడు మహారాజు. అతణ్ణి గురించిన వివరాలన్నీ తెలుసుకొని, మంత్రులను, దండనాయకుణ్ణి పిలిపించి ఆపల్లెకు చేరడానికి చతురంగబలం సిద్ధం చేయమన్నాడు. రాజాజ్ఞ ననుసరించి సకలవిధరాజలాంఛనాలతో ప్రయాణానికి ఏర్పాటు చేశారు. జానశ్రుతి మహారాణులతో బయలుదేరి అనతికాలంలోనే ఆమారుమూల పల్లెకు చేరాడు.

**నేనెంతో అదృష్టవంతుణ్ణి!**

రైక్వుడు రాజు వస్తున్నాడన్న వార్త విని తనలో తాను నవ్వుకున్నాడు. అల్లంత దూరంలోనే తన బలగాన్ని ఆపి జానశ్రుతి తన రాణులు వెంటరాగా దాసదాసీజనం వజ్రవైడూర్యాలు పొదిగిన

వివిధాభరణాలను, పట్టు వస్త్రాలను, ఆకాలంలో దొరికే పుష్పహారాలను అనేక ఫలాలను తీసికొనిరాగా రైక్వుడు కూర్చొన్న చోటుకు చేరాడు. రైక్వుని చుట్టూ ఈ కానుకలన్నింటిని పెట్టి దాసదాసీజనం దూరంగా వెళ్లి పోయారు. మహారాజు రాణులతో కూడా ఆమహనీయునికి ప్రణమిల్లి నిలబడ్డాడు. ఆ మహాత్ముణ్ణి దర్శించిన జానశ్రుతి ఇలా ఆలోచించసాగాడు-

*''ఆహా! నాజన్మ ధన్యమైంది. ఈ సాధుజన వల్లభుని కోసమా నేను సామ్రాజ్యమంతా వెదికించింది? ఏమి బ్రహ్మ తేజస్సు! ఎంతటి సాత్త్వికప్రవృత్తి! చిఱునవ్వుతో మెఱిసిపోయే ఆమహనీయుని ముఖారవిందాన్ని చూస్తుంటేనే పారవశ్యం కలుగుతోంది. ఆయన మాటలు నిజంగానే అమృతపు ఊటలులాగా ఉండవచ్చు. ప్రాతః స్మరణీయుడైన ఈ తాపసి దర్శనం పూర్వజన్మ సుకృతఫలమనడంలో సందేహం లేదు. మాయ మర్మాలకు అతీతమై అలరారే ఈ మహనీయుని సాన్నిధ్యం ఎంతో అరుదుగా గాని లభించదు. నిజంగా నేనెంతో అదృష్టవంతుడిని''.*

ఈ భావవాహినినుంచి తేరుకొని రైక్వునితో ఇలా అన్నాడు-

*''మహానుభావా! ఈనాడే నా జన్మ ధన్యమైంది. తమ దర్శనభాగ్యంచేత నా అజ్ఞానం పటాపంచలైంది. తమసన్నిధి నాకొకపెన్నిధి. సాక్షాత్తు పరబ్రహ్మభావాన్ని అనుభూతిలోకి తెచ్చుకున్నట్లుంది ఈ క్షణం. 'చంద్రునికో నూలుపోగు'లా నేను సమర్పించిన ఈ చిఱుకానుకల్ని స్వీకరించండి. నన్ననుగ్రహించండి. ఆనంద ప్రాప్తికి మూలమైన తత్త్వజ్ఞానాన్ని నాకు బోధించండి. నేను మీ శిష్యుడిని''.*

**వీటికి నాదగ్గఱ విలువలేదు!**

రైక్వుడు ఆ కానుకల వంక కన్నెత్తికూడా చూడలేదు. రాజుమాటలు విని ఏదో విచలితావస్థలో ఉన్నట్లు కనబడ్డాడు. అంత ప్రసన్నంగా లేడు. రాజు సమర్పించిన బంగారు ఆభరణాలు, పట్టువస్త్రాలు, వివిధ ఫల పుష్ప హారాలు అతణ్ణి ఆకట్టుకోలేకపోయాయి. నిండుకుండలాగా పరిపూర్ణమైన వ్యక్తిత్వం కల రైక్వుడు నిత్యతృప్తుడు. నిష్కామకర్మయోగి. గొప్ప ఆత్మజ్ఞాని. ఆయన రాజునిలా మందలించాడు-

> **"ఓ మహారాజా! ఈ వస్తు వాహనాలకు, సువర్ణాభరణాలకు నా దగ్గఱ ఇసుమంతైనా విలువలేదు. ఆత్మజ్ఞానం ముందు వీటికి విలువశూన్యం. నీ సామ్రాజ్యమంతా ఇచ్చి కూడా నీవు ఆత్మ జ్ఞానాన్ని కొనలేవు. భౌతికమైన ఈ సిరిసంపదలు, భోగభాగ్యాలు, అధికారాలు ఆత్మజ్ఞాని ముందు విలువలేని పదార్థాలు. ఇన్ని విలువలేని పదార్థాలు తీసుకొనివచ్చి నాకిచ్చి అమూల్యమైన ఆత్మజ్ఞానాన్ని , అమృతానుభవాన్ని పొందాలనుకోవడం దురాశే అవుతుంది."**

**ఇంకా గౌరవం పెరిగింది :**

ఆ మహాత్ముని మందలింపు మాటలకు జానశ్రుతి నొచ్చుకున్నాడు. భౌతికవస్తువుల విలువలేనితనాన్ని తెలుసుకోగలిగాడు. జ్ఞానంతో సమానమైన పవిత్ర వస్తువు ఈలోకంలో ఇంకోటి ఉండదుకదా! రైక్వుని ఆత్మతృప్తిని, విరక్తిని, జ్ఞాననిష్ఠను తెలుసుకొని తన తెలివితక్కువ తనానికి సిగ్గుపడ్డాడు. సిరిసంపదలతో, భోగభాగ్యాలతో, అధికారాలతో ప్రపంచంలో దేన్నైనా కొనగలమనుకోవడం అవివేకం.

వీటన్నింటివల్ల పొందలేనిది కూడా ఒకటుంది. అదే అమూల్యమైన ఆత్మతత్త్వజ్ఞానం. దాని ముందు ఈలోకాలన్నీ దిగదుడుపే అవుతాయి.

భౌతికవిషయాలకు ప్రలోభపడని రైక్వుని మనస్తత్వం మహారాజునెంతగానో ఆకర్షించింది. ఆయన చేసిన మందలింపును రాజు ఉపదేశంగా పరిగ్రహించాడు. రైక్వుడు ఆత్మజ్ఞానాన్ని ఉపదేశించలేదనే అసంతృప్తి లోపల ఉన్నప్పటికి అనన్య సాధారణమైన ఆయన వ్యక్తిత్వానికి ముగ్ధుడై రాజు పరివారంతో వెనుదిరిగాడు. సాంసారిక దుఃఖ తప్తులైన ఎందఱో రైక్వుని దగ్గఱ హితబోధను పొంది మనశ్శాంతితో జీవించారనే మాటలు విన్న మహారాజుకు ఆ మహాత్మునిపై గౌరవప్రతిపత్తులు ఇంకా ఇంకా పెరిగాయి. అంతటి భాగ్యం తనకెప్పుడు కలుగుతుందోనని ఎదుఱు చూడసాగాడు.

బాగున్నావా?

సంకల్పం కలిగిన వెంటనే లభించినదానికంటే ఎదుఱు చూసి సాధించినదానిపైనే మానవునికి ఆదరమెక్కువగా ఉంటుంది. జానశ్రుతి మనసంతా రైక్వుడే నిండిపోయాడు. ప్రసన్నగంభీరమైన ఆసాధువు ముఖారవిందం, మొక్కవోని ముఖవర్చస్సు, నిర్భీకతకు నిలయాలైన విశాలనేత్రాలు, స్వచ్ఛతకు నెలవైన చిఱునవ్వు.... ఇంకా ఇలా ఎన్నో, ఎన్నెన్నో లక్షణాలు, అన్నింటినీ మించి ఆయన సదుపదేశం జానశ్రుతి మరువలేక పోతున్నాడు. ''ఎప్పుడెప్పుడు మళ్లా ఆయన సందర్శనభాగ్యం కలుగుతుందా? ఎప్పుడెప్పుడు ఆయన వల్ల ఆత్మజ్ఞానం పొందగలుగుతానా?'' అని గడియలు లెక్క పెడుతున్నాడు.

ఆ రోజు రానే వచ్చింది. రాజు నిరాడంబరంగా, ఎవరూ వెంట రాకుండా, సామాన్యమైన వస్త్రాలను ధరించి, ఆపల్లెకు చేరాడు. ఆ తాపసి

ఇంతకుముందున్న చోటనే అర్థనిమీలిత నేత్రుడై తపస్సమాధిలో ఉన్నాడు. రాజు అలాగే ఆయన కటాక్షం కోసం వినయావనతగాత్రుడై ఎదురు చూస్తూ నిలబడ్డాడు. కొంతసేపటికి ఆ మహానుభావుడు కండ్లు తెరిచి చూశాడు. ఎదురుగా వినయంతో విరక్తితో నిలబడ్డ రాజు నిలా పలకరించాడు -

*''బాగున్నావా? పరిపాలన ధర్మబద్ధంగా సాగుతున్నదా''?*

జానశ్రుతి ఆ పలకరింపుకు ఉప్పొంగి పోయాడు. సాష్టాంగ ప్రణామం చేసి-

*''మీ దయవల్ల సపరివారంగా బాగున్నాను. నా ఏలుబడిలోని ప్రజలంతా సుఖంగా ఉన్నారు. అయినా ఆత్మజ్ఞానసంపన్నులు తమరు ఈ భూమిపై నివసిస్తుండగా ప్రజల శాంతికేమి లోటుంటుంది?'' అన్నాడు.*

''మహారాజువు, మహావృషసామ్రాజ్యాధినేతవు.

*ఇలా ఒంటరిగా వచ్చావే?''*

అన్నాడు రైక్వుడు.

దయచేసి పరిగ్రహించండి!

*''స్వామీ! అన్నీ తెలిసే అడుగుతున్నారు. మానవుడెప్పుడూ ఒంటరివాడే కదా! భ్రాంతికల్పితాలు ఈ లోకంతో అనుబంధాలు. సత్యమాలోచిస్తే ఏజీవి చేసుకున్న సుఖ దుఃఖప్రారబ్ధాలను ఆజీవి అనుభవించడానికే కదా! ఈ లోకంలో ప్రవేశించడం. ''జన్తూనాం నరజన్మ దుర్లభం''*

అని పెద్దలు చెబుతారు. అంత ఉత్తమమైన నరజన్మను పొందికూడా కుబుద్ధితో, కుమార్గాలతో, కుత్సిత సంకల్పాలతో కామ క్రోధాదులకు కట్టుబడి జీవుడు ఈ శరీరం శాశ్వతమని, ఈ జన్మ శాశ్వతమని భావించి ఎన్నో పాపాలు చేస్తుంటాడు. తిరిగి తిరిగి సంసార చక్రబంధంలో పడుతూ లేస్తుంటాడు. ఎప్పటికి ఈ జనన మరణ పరంపరకు అంతం కలుగుతుంది? తమరు తత్త్వజ్ఞాన సంపన్నులు. ఆత్మానుభూతి మీ హస్తగతం. దయచేసి నన్ను మీ శిష్యుడిగా స్వీకరించండి. అమృతత్వాన్ని పొందే మార్గం ఉపదేశించండి. ఈ కానుకల్ని, ఫలపుష్పోపహారా లను నిరాకరించకుండా పరిగ్రహించండి.''

అని జానశ్రుతి ఆ మహాత్ముణ్ణి సవినయంగా వేడుకున్నాడు.

నీ వినయానికి ముగ్ధుడనయ్యాను :

ఈ సారి రాజు మనోనైర్మల్యాన్ని, ఆధ్యాత్మికజ్ఞాన జిజ్ఞాసను, వినయాన్ని దృష్టిలో పెట్టుకున్న రైక్వుడు అతని అభ్యర్థనను తోసిపుచ్చలేదు. మౌనంగా ఉన్నాడు.

*''మహానుభావా! నా కుమార్తెను తమరు ధర్మపత్నిగా స్వీకరించండి ! ధార్మిక చిత్తవృత్తి గల ఆమె మీకు సపర్యలు చేస్తూ తన జీవితాన్ని సఫలంచేసుకుంటుంది.''*

అన్నాడు మహారాజు. దానికి కూడా రైక్వుని నుండి అంగీకారంగాని, తిరస్కారంగాని లేదు. ఆయన వైఖరిలో ఏమార్పులేదు. ఆశ్చర్యపడ్డాడు మహారాజు. కనురెప్పవాల్చకుండా ఆయన నోటి వెంట ఎలాంటి సమాధానం వస్తుందోనని ఎదురు చూడసాగాడు.

రైక్వుడిలా అన్నాడు-

*''రాజా! నీవినయం నన్ను ముగ్ధుణ్ణి చేసింది. నిన్ను అంతేవాసిగా అంగీకరిస్తున్నాను. నీకు ఆత్మజ్ఞానాన్ని ఉపదేశిస్తున్నాను.''*

జానశ్రుతి ''ధన్యోస్మి'' అన్నాడు.

**అన్నింటికి ఆయనే మూలకారణం:**

రైక్వుని ఉపదేశం ఇలా సాగింది-

*''మహారాజా! లోకంలో ఎందరో ఎన్నో రకాల ఆత్మను భావన చేస్తారు. ఉపాసిస్తారు. ఆరాధిస్తారు. ఆత్మ నిత్యమైంది. సత్యమైంది. నిర్వికారమైంది. అది ఇంకొకదాని చేత సృష్టింపబడేది కాదు. ఈ సృష్టికంతా ఆత్మే మూలం. లోకంలోని అన్నివిషయాలకు ఆత్మే మూలకారణం.''*

. . . .

*''నీవు దానాలు చేస్తున్నాననుకుంటున్నావు. గర్వపడుతున్నావు. కీర్తి ప్రతిష్ఠలను ఆశిస్తున్నావు. నిర్మలమైన మనస్సుతో నేను చేస్తున్నాననే భావనలేకుండా నిష్కామంగా దానం చేయాలి. అప్పుడు నీలో ఎటువంటి అహంకారం పెరగదు. లోలోపల అహంకారాన్ని పెంచుకున్నావు. అది ఆత్మవినాశం కలిగిస్తుంది. నీవు చేసే దానాలతో నీ ధార్మిక ప్రవృత్తిని కొలుచుకోవడం కూడా అనర్థమే. వాస్తవమాలోచిస్తే ఈలోకంలో నీదంటూ ఏదీ లేదు. భగవంతుడిచ్చిన దాన్ని మంచిమనస్సుతో ''నేను ఇస్తున్నాను'' అనే భావన లేకుండా భగవత్స్వరూపులైన ఇతరజీవులకు అందిస్తున్నాననే భావంకావాలి. నీవు నిమిత్తమాత్రుడివి.*

ఇదివఱకు నీకు ఇచ్చిన వాడు, ఇప్పుడు నీచేత ఇప్పిస్తున్నవాడు, నీనుంచి పుచ్చుకుంటున్నవాడు అన్నీ ఆయనే. నిన్నొక నిమిత్తంగా పెట్టి నీకు మంచి పేరు అందిస్తున్నవాడు కూడా ఆయనే నని భావన చెయ్యడం మంచిది. ఇలా అనుకోవడం వల్ల నీకు ఆత్మానుభూతి కలుగుతుంది. అది అమృతత్వానికి దోవ చూపిస్తుంది.''

అదే 'రైక్వపర్ణ':

మహాత్ముడైన రైక్వుని ఉపదేశాన్ని విని జానశ్రుతి ఆనంద పరవశుడయ్యాడు. అతని ముఖంలో అంతకు ముందులేని జ్ఞానదీధితులు ప్రకాశించాయి. ఏది జరిగినా తను కేవలం నిమిత్త మాత్రుణ్ణనే అధ్యవసాయం బలపడింది. వినయంతో ఇలా రైక్వునికి మనవిచేశాడు-

*''మహానుభావా! వెయ్యి పాడి ఆవుల్ని, ఈ రథాలను, బంగారు నాణేలను, నాకుమార్తెను పరిగ్రహించి నన్ను ధన్యుణ్ణి చేయండి''.*

రైక్వుడు చిఱునవ్వుతో రాజువంక చూశాడు.

ఇంతకుముందు మాదిరి నిరాకరించలేదు. జానశ్రుతి రైక్వునికి ప్రణామంచేశాడు. సెలవివ్వమని ప్రార్థించాడు. తన రాజధానికి ప్రయాణం సాగించాడు. మహావృషసామ్రాజ్యంలో మహాత్ముడైన రైక్వుడున్న ప్రాంతానికే తరువాత. ''రైక్వపర్ణ'' అనే ప్రసిద్ధి కలిగింది.

*ఓం శాంతిః శాంతిః శాంతిః*



